సంపుటము 5]    ఆగస్టు, 1918    [సంచిక 2

# బాలమిత్ర



మా పాప అందం మతాబీల అందం
మా కందు చందం గులాబీల చందం
మా బాల వాక్యం జిలేబీల పాకం.

జిలిబిలి పలుకులు పలికీ
జిలిబిలి పాటలు పాడీ
చిలుకల పలుకులు పలికేవారూ చిన్నిపాపలేను. 1

అందము కలిగినవారూ
సందడి చేసేవారూ
చిందులు తొక్కుచు ఆడేవారూ చిన్నిపాపలేను. 2

మురిపింతలు కలవారూ
మెరుపులు మెరిసేవారూ
సిరియూ సంపద లిచ్చేవారూ చిన్నిపాపలేను. 3

వెన్నెల నవ్వులతోడా
కన్నులు కలకలలాడా
చిన్నిపిల్లలూ కలిగిన ఇంటికి చీకటి ఉంటుందా? 4



# కమలస్వేచ్ఛ

కమల ముఖము మాడ్చుకొని కోపముతో “ చీ, పో నీవంటే నాకిష్టములేదు ” అని తల్లితోననెను.

తల్లి ఏమియు అనక ఊరకుండెను.

"అబ్బా నేనుకూడ మరియున్నైతే ఎంతమేలు! అది వీధి లోను, ఎవరింటికాడబడితే వారింటికాడ యిష్టమువచ్చినట్లు ఆడుకొనగలదు. నీళ్లుపోసికొనవక్కరలేదు, బట్టలు మార్చ నక్కరలేదు, గుడికిగాని బడికిగాని పోనక్కరలేదు. ఏమిజేసినా ఏమిలేదు, ఎవరేమి అనరు, బాగా ఆడుకోవచ్చును పాడుకో వచ్చును.

కమలమ్మ తల్లి కొంచెముసేపు ఆలోచించెను. "కమిలీ నీవు మరియువలెనే ఉండవచ్చును. దానివలె నీ యిష్టమువచ్చి నట్లు దినమంతయు ఆడుకొనవచ్చును."

"నిజంగానా! ఓ, అట్లయితే ఎంతసంతోషము. నేనిప్పుడే వెళ్లి ఆడుకొంటాను" అని వెళ్లి ఆడుకొనెను.

గాని ఆనాడు ఎవరును కమలమ్మతో ఆడుకొనలేదు. ఎక్కడి వారక్కడ పనిమీదనుండిరి. కమలమ్మ తన యిష్టమువచ్చినంత సేపు ఆడుకొని, వీధియావత్తు పరుగెత్తి, తిరిగివచ్చెను.

ఇంతలో ఆకలియాయెను. ఇంటికివచ్చి "అమ్మా నాకే మయినా పెట్టవే"యని అడిగెను.

"ఎవరది? ఎందుకు వచ్చినావు. ఫోఫో, నీవెవరవో నాకు తెలియదు" అని తల్లియనెను.

"నా కాకలి యగుచున్నదే."

"అయ్యో! పాపము అయితే నేనేమి జేసేది?"

కొంచెము సేపటివరకు కమలమ్మ మెట్లమీద కూర్చుండి "హన్నావాండ్ల యింటికి పోయి వచ్చేదా?" అని అడిగెను.

"ఎవరురా యిది, ఎంతచెప్పినా కదలకున్నది. నన్నెందు కడిగెదవు?" అని తల్లియనెను.

కొంచెముసేపటి కామె తండ్రి యింటి భోజనమునకు వచ్చెను. తల్లిదండ్రు లిద్దరును కూర్చుండి అన్నము తినిరి. కమలమ్మ కుసిని యొద్దకుబోయి, "అమ్మా! నాకేమయినా పెట్టవా?" అని యడిగెను.

తల్లి ఒక బొచ్చెలో కొంచెము అన్నమును, పచ్చడియు వేసి అడుక్కుతినువారికి పెట్టునట్లు పెట్టెను.

సాయంకాలమున తండ్రి బండిదెచ్చి, తల్లియు తానును తాతగారింటికి బోవ బైలుదేరిరి. అప్పడు కమలమ్మ వచ్చి "అమ్మా నేనుకూడా వచ్చేదా?" అని అడిగెను.

తల్లి "ఛీ,ఛీ, ఎవతెరా ఈ పాడుపిల్ల. మాటి మాటికి వచ్చి, అమ్మా లొమ్మా అని వెంటబడినది. ఇంకొకసారి వచ్చిన యెడల జాకీ నుసి కొలుపుతాను అని, బండెక్కి వెళ్లిపోయిరి.

వారు వెళ్లినపిదప కమలమ్మ యింటి మెట్లమీదకూర్చుండి ఊరికె ఏడ్చెను. వారింట్లోపనిజేయు రామక్క వచ్చి ఆమెను జూచి తానుగూడ యేడ్చెనుగాని ఏమియు మాటలాడగూడదని తల్లి చెప్పినందున నోరుతెరవలేదు.

ఒక గంటలోగా బండితిరిగివచ్చెను. తల్లి బండిదిగక పూర్వమే తల్లియొద్దకు పరుగెత్తుకొనిపోయి ఆమెను పట్టుకొని "అమ్మా! నేను నీబిడ్డ కమలమునే, ఇకమీదట మరియనుగాదే, నిన్ను ప్రేమించుచున్నాను. నాయనకూడా నాకెంతో యిష్టము. ఇకమీదట నీ మాటప్రకారముచేసెదను, నీ యిష్టమునచ్చిన పని, చెప్పుము. బుద్ధివచ్చినదని చెప్పి యేడ్చెను.

తల్లి బిడ్డను ముద్దుపెట్టుకొని "నాబిడ్డ కమలమువచ్చినది. నాకెంతో సంతోషము. ఇకను మంచి బిడ్డయైయుండును" అని చెప్పెను.



# బాలికా విషయములు

1. చందమామ! రావే
జాబిల్లి రావే
చేకొండ్రని లకొండ్రపిడత
లాడుకోను తేవే.

2. తెల్లని పువ్వులు మల్లీపువ్వులు
పచ్చని పువ్వులు బంతీపువ్వులు
నల్లని పువ్వులు జిల్లేడుపువ్వులు
ఎర్రని పువ్వులు ఏమిటో చెప్పు.

3. తెల్లని మడిలో
నల్లని విత్తులు
జల్లామ్ చేతితో
ఏరామ్ నోటితో.



# బాలమిత్ర టపా




నా ప్రియ బాలమిత్రను చదివెడి బాలుర బాలికలారా!

నేను బాలమిత్రటపాకు ఒక ఉత్తరము వ్రాయవలె నని నాకు చాలాకాలమునుండి మిక్కిలి అభిలాషగలదు. అది ఇన్నాళ్లకు దేవుడు సఫలపరచినందున నేను మిక్కిలి ఆనంద భరితురాలనై యున్నాను. నేను చదివిన కథలలో ఒక చిన్న కథనుగూర్చి మీతో చెప్పగోరుచున్నాను.

ఒకపిల్లవాడు రంగూన్‌పోవలయునని కాకినాడలో స్టీమరు నెక్కెను. అతడు చాలబీదవాడైనందున భోజనముకొరకని కొన్నిరొట్టెలు పప్పు సిద్ధముచేసికొని పెద్ద మూటగట్టుకొని దానిలోని కెక్కెను. రాత్రిభోజనము వేళకాగానే మూట విప్పి రొట్టెలు పప్పుతిని తక్కినది మూటగట్టుకొనెను. వంట గదికిని భోజనశాలకును సమీపమున కూర్చున్నందున వంటకముల పేలింపులు తాలింపులు బహుబాగా వాసన కొట్టుచుండెను. అప్పుడాపిల్లవాడు “ఆహా! వారితో కూర్చుండితింటె బాగుండునుగదా” యనెను. ఉదయము తిరిగి రొట్టెలు పప్పుతినెను. మధ్యాహ్నభోజనమునకై తయారగుచున్న మాంసపు పేలింపులు తాలింపులు వాసనలకు నోరూర సాగెను. గుటకలు మెండాయెను. ధనవంతుడనైతే వారితో కలసితిందునుగదా యనుకొనుచు తిరిగి బూజుపట్టిన రొట్టెలు పులిసిన ముద్దపప్పుతిని నీళ్లుత్రాగి కూర్చుండి తనయొద్దనున్న డబ్బులు లెక్కించుకొని ఒకసారి వారితో భోజనముచేయ నాశపడి సాయంకాలము నధిపతియొద్దకువెళ్లి “అయ్యా! ఒకసారి భోంచేసితే ఎంతతీసుకొందురని” యడిగెను. అందుకాయన మిక్కిలి ఆశ్చర్యపడి “ఏమి నీవుటికెట్టుకొనలేదా?” యనెను. అందుకతడు “కొన్నానండి” యనగా నా యధిపతి “ఓరి బుద్ధిహీనుడా! నీవుకట్టిన కేవునందుఅంతయు కలదని

ఎరుగవా, పోయిభోజనంచేయరా" యనెను. అందుకతడు తన బూజుపట్టినరొట్టెలను సప్పను సముద్రములో పారవేసి యితరులతోపాటు నాటిరాత్రినుండి మిక్కిలి తృప్తిదీర భోజనము చేసెను.

మనలో అనేకమంది క్రైస్తవులు తమ తండ్రియొద్దనుండి తృప్తిగా భోజనముచేసి ఆనందించుటకు బదులుగా పందులకాయలతో తృప్తినొందుట చూచుటలేదా? నిజముగ ననేకులు కానానులోని పాలు తేనెలను త్రాగుటకు బదులుగా ఐగుప్తులోని కర్బూజికాయలు ఉల్లిపాయలు మొదలైనవి తినవిష్టపడుచున్నారు. ఆ పిల్లవానివలె సమస్తము ఆ టిక్కెట్టులోనున్నదని యెరుగరు "మన అందరికొరకు ఆయనను అప్పగించినవాడు ఆయనతోపాటు సమస్తము మనకెందు కనుగ్రహింపడు. రోమా 8:32 మనకు క్రీస్తుదొరికినప్పుడు ఆయనతో సమస్తము దొరికెను.

ఇట్లు మీ ప్రియ బాలమిత్రురాలు

పి. కరుణమ్మ

నర్సాపురము

# సింహము, తోడేలు, నక్క



ఒక మహారణ్యములో నొక సింహము కలదు. అది గొప్ప జబ్బువలన భాధపడుచు తనగృహమునుండి కదలలేక పడియుండెను. సింహము మృగరాజు గనుక, నక్కలు తప్ప తక్కిన మృగములన్నియు దినదినము మృగరాజు క్షేమము తెలిసికొని పోవుచుండెను. నక్కలకు సహజశత్రువగు తోడేలు సింహముతో.

తోడేలు:—ఓ మృగరాజమా! మిమ్మిన్ని మృగములు చూచి పోవుచుండెనుగాని, ఒక నక్కైనా చూడవచ్చినదా?

చూడుడు దేవరవారినే యిట్లు లనాదరణ చేయు చున్నవి. తక్కిన మృగములను లెక్కచేయునో యూహింపుడు.' అని చెప్పుచుండగా చాటున యీ సంగతి వినుచున్న నక్క గిరుక్కున పొదచాటుకు పోయి వచ్చు దానివలె పెద్దగొంతుతో యేడ్చుచూ సింహము దాపునచేరి నిలువబడెను.

సింహము:—(కోపముతో కనువెఱ్ఱజేసి) ఓరి దురాత్మా! ఎందుకు వచ్చియున్నావు. రా! మూఢా!

నక్క:—(వడకుదానివలె అభినయించుచు నిలువబడి, దైన్యముతో) మృగోత్తమా?

"సరసజేరి నిన్ను సంస్తవమొనరించు,
వారలెల్ల సఖులుగారె నీకు,
కష్టకాలమందు గాచువాడొక్కడే,
నిక్కమైనసఖుడు నీకు దలప"

అనునట్లు దినదినమువచ్చు తుచ్ఛమృగములెల్ల మీ ఆరోగ్యమునుగూర్చియేమి విచారించిరి? దగ్గరనుండి ముఖస్తుతి చేయుచూ, కబురులు చెప్పువారే కాని అక్కర వచ్చినప్పుడు పట్టుమని పదిగడియలు నడచి స్వామికార్యము నెరవేర్చువారొక్కరులేరు. దేవరకు రోగమువచ్చెనని విన్నతోడనే మా

కులము వారమంతా గోగుపడి సభచేసి, తమ రోగనివర్తికి మందు తేవలయునని, యిండ్లవాకిండ్లను, దారపుత్రులను, వదలి తలా ఒక దిక్కుగా పోతిమి. నాపూర్వ సుకృతమున, వింధ్యారణ్యమున నొక సింహ చక్రవర్తినిచూచి, ఆయనవల్ల తమ రోగనివారణమునకు మందు తెలిసికొని పడరానిపాట్లు పడివచ్చితిని. కన్న తల్లికైనను కనుమర గుండవలయునుగదా "రహస్యములేనిది మంత్రముపారదు." అనగా సింహము తోడేలును దూరము పొమ్మనెను.

తోడేలు :—"చిత్తం మహాప్రభూ!" యని దూరమున నిలుచుండెను.

నక్క :—(సింహము చెవిలో) "ప్రభూత్తమా! ప్రతికి యున్న తోడేలు రక్తముపీల్చి దానిచర్మము కప్పుకొనిన, రోగము నివారణమగునట" యని చెప్పెను.

సింహము :—"స్నేహద్రోహ మనేగాని కావలసినది యిచ్చుటనే యున్నది?" అనిన.

నక్క :—దేవరకు చిత్తం వచ్చినట్లు చేయవచ్చును. తనకు మాలిన ధర్మము లేదుగదా? అని పలుకగానే,

సింహము తోడేలును దగ్గరకుపిలిచి దానిని బలాత్కారముగాపీకి రక్తముపీల్చి చర్మము కప్పుకొనెను.

నక్క :—"మీవ్యాధి కుదిరినట్లే" యని శత్రువిజయము నకు సంతసించి వెళ్లిపోయెనుగాన ఇతరులకు కీడుచేయ వలెననికోరువారికి తమకే కీడు వాటిల్లును.

---

# దేవుని పంట

నాన్నా! నేను నాతోటలో దేవునికొరకేమి వేసేది? చిక్కుడా, ఉల్లియా? ఏది ఎక్కువపండును? అని విల్యము తండ్రినడిగెను. మిషనెరీపనికి చందానుకూర్చుటకై ఆయన విల్యముకు తోటలో కొంతభాగమిచ్చెను.

"ఏమివేస్తే బాగా ఉండునో నాకుతెలియును" అనివాని మేనత్త అనెను.

"ఏమిటి?"

"నాతోటలో అయిదుపాదులుచేసి ఒకదానిలో ప్రేమ విత్తనములు, రెండవదానిలో విధేయతవిత్తనములు, మూడవ దానిలో సత్యవిత్తనములు, నాల్గవదానిలో మధుపాననిషేధ విత్తనములు, అయిదవదానిలో వినయ విత్తనములు నాటెదను అవి దేవునికెంతో ప్రియమైన పంటలు"ని ఆమె చెప్పెను.

"అక్కా! నే నీవిత్తనములను ప్రతిదినమును నా హృదయములో విత్తుచున్నానుగాని కలువు త్వరగా మొలచునని అమ్మ చెప్పినది గాన నేను బాగా త్రవ్వుచున్నాను." అని కుమారుడనెను.

---

# నెమలి

నెమలి ఈ దేశమునందు పుట్టినది. ఇక్కడనీ పక్షులు అనేకములుగానుండును. దాదాపు 3,000 సంవత్సరముల క్రిందట సోలోమోను యొక్క యుద్ధనావికులు తూర్పు ప్రక్కనుంచి వీటిని తమ దేశమునకు తీసికొని వెళ్లిరి. అధిపుడైన అలెగ్జాండరు వీటిని యూరోపుఖండములో తెలియునట్లు చేసెను. చాలాకాలమువరకు నివి అరుదుగా నుండునవి. ఒకవేళ యున్నను చాలా ఖరీదుకు కొనబడునవి. చుట్టుప్రక్కల నుండు పట్టణములలోని జనులు వీటిని జూచుటకై గుంపులు గుంపులుగా కూడుకొనువారు. దానితోకను కప్పియున్న పొడవైన ఈకెలకు నది ప్రసిద్ధికెక్కియున్నది. దీనిని అది తన యిష్టమువచ్చినప్పుడు ఒక పెద్ద విసనకర్రవలె విప్పుకొనును. ప్రతి ఈకెకును చివరను కన్నువలెనుండు గుండ్రమయిన కంట్లు ఉండును. తన అందమునకు తానే మెచ్చుకొనునట్లుగా



నది తన సుందరమయిన ఈకెలను విప్పుకొని గర్వముగా నడుచును. అది ఆలాగున నడుచుచున్నప్పుడు "మీ రెప్పుడయిన నాయంత అందముగల పక్షిని చూచితిరా" అని అడుగుచున్నట్లుండును. ఈలాగున చేయుట ఆడు నెమళ్లను మెప్పించుటకే దాని ముఖ్య ఉపయోగమైయున్నది.

నెమళ్లు బహుత్వరగా పరుగెత్తగలవు. అవి చెట్లయొక్క కొమ్మలమీద పరుండును. కాని క్రిందనుండు దట్టమయిన కంచెలలో అగపడకుండునట్లు తమ గూటిని కట్టుకొనును. వీటిగూళ్లు అంత జాగ్రతతో చేయబడవు. కొన్ని పుల్లలును

రెండు చిదుకులును ఆకులతో కలిపి ఉంచబడును. ఒక నెమలి తన గ్రుడ్లను పగలగొట్టును లేక పిల్లలను చూచిన యెడల వాటినిగూడ చంపును. కాని తల్లిపక్షి దయగలిగి అతి జాగరూకతతో వాటిని కాచుకొని యుండును.

నెమళ్లు పురుగులను, ధాన్యమును, పుష్పాల మొగ్గలను లేత చెట్లను తిని బ్రతుకును. అవి పాములను ఇతరపురుగులను చంపును. చాలామంది హిందువులవల్ల నవి అతిభక్తితో చూడ బడును. వాటిలో నేదైననొకటి చంపబడినయెడల వారికి చాలా కోపమువచ్చును. నెమలియొక్క కేక మధురముగా నుండదు.

దాని యందమునకదే మెచ్చుకొని గర్వముగానుండును గనుక మనము నెమలినిచూచి నవ్వుదుము. అయినను అనేక మంది పిల్లలును, మగవారిలోను ఆడువారిలోను పెద్దవారును గూడ తమ క్రొత్తబట్టలను వస్తువులనుచూచి చాలా గర్వింతురు. మనకంటె యెక్కువగా నెమళ్లకు తెలియజాలదు. కాని మంచిస్వభావమును దయగల మనస్సును, పై యందములకంటె చాలా పొగడతగినవని పిల్లకాయలు తెలిసికొన వలెను.

C. L. S. PRESS, MADRAS—1918